# జ్యూలియస్ ఫ్యూజిక్ జీవితం

హిట్లర్ జర్మనీలో జ్యూలియస్ ఫ్యూచిక్‌ను 1943 లో ఉరివేసి చంపారు. ఉరితీసి చంపితే ఫ్యూచిక్ ఫూరూ పేరూ లేకుండా నూరుమాసి పోతాడని ఆ నరరూప రాక్షసులు భ్రమించారు. జీసస్ క్రీస్తుకు శిలువ వేసిన పాషాణుల ఆశలు ఎంతగా ఫలించాయో, ఈ పాపుల బుద్ధులుకూడా అంతగానే నెరవేరాయి. నాటినుంచి ఫ్యూచిక్ పేరు దేశదేశాన మార్మోగింది. దిక్‌దిగంతాలకు వ్యాపించింది. చరిత్రలో చిరస్థాయిగా వెలుగొందుతోంది. శాంతికోసం, స్వాతంత్ర్యంకోసం, స్వేచ్ఛా జీవితంకోసం ఆరాటపడుతున్న, పోరాడుతున్న కోటానుకోట్ల జనుల హృదయాంతరాళాల్లో అనూస్యూతంగా, నిత్యనూతనంగా ఫ్యూచిక్ స్మృతి కలకాలం అలరారుతూనే వుంటుంది. ఆ అమరజీవి ఫ్యూచిక్ జీవిత చరిత్ర ఇది:

ఫ్యూచిక్ పుట్టిందీ, పెరిగిందీ దారిద్ర్యం తాండవమాడే కష్టజీవుల పేటలో. ఆ పేట పేరు స్మిఖోవ్. ప్రాగ్ నగర పరిసరాలలో వుంది. జననం 1903 ఫిబ్రవరి 23 వ తేదీ. తండ్రి పేరు కారెల్. ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికుడు. చేసేది కాయకష్టమే అయినా ఒకవిధంగా కళాజీవికూడా. సంగీతం అంటే పడి చచ్చిపోయేవాడు. తీరిక సమయాలలో క్లబ్‌లలో కంఠం విప్పి గానంచేసేవాడు. ఆ విధంగా 1912 దాకా అటు కాయ

కష్టం, ఇటు కళాసాధన చేస్తూ, జీవయాత్ర సాగిస్తూవచ్చాడు కారెల్.

ఇక తల్లి, మేరీఫ్యూచికోవా సంగతా? కరుణ తొణికిసలాడే ఆర్ద్రహృదయం ఆమెది. అలాంటి మాతృదేవి సందిటనే ఫ్యూచిక్ బాల్యమంతా గడిచిపోయింది.

తండ్రిలో గోచరించే సున్నితమైన హాస్యం, ప్రగాఢమైన జీవితానురక్తి ఫ్యూచిక్‌కు అబ్బినవి. తల్లి పరంగా నిగ్రహ స్వభావం, ఆర్ద్రత అతనికి అలవడ్డాయి. అదేమి విచిత్రమోకాని, ఆ కుటుంబంలోనివారందరివీ కోకిల కంఠాలే. తల్లిదండ్రుల వలె ఫ్యూచిక్ కూడా సంగీత ప్రియుడే. ఫ్యూచిక్ బాబాయి – అతని పేరూ జ్యూలియస్ ఫ్యూచిక్ – పేరు మోసిన ప్రజా గాయకుడు. ఆయన పేరు వింటేచాలు, ఈనాటికీ జెక్ ప్రజానీకం మేను ఉప్పొంగిపోతుంది.

అప్పటికి మన జ్యూలియస్ ఫ్యూచిక్‌కు యింకా రెండున్నరేండ్లు నిండలేదు. అంత చిన్నవయస్సులోనే అతను నాటకరంగపై ప్రత్యక్షమయ్యాడు. మరికొన్నాళ్ళకు, చెల్లెళ్లు లిబూజ్, వీరాలతో పాటు నాటకాలలో చిన్నపిల్లల పాత్రలు నిర్వహించాడు. తొమ్మిదోయేట బెర్లిన్ వెళ్లి, అక్కడ జెక్ ప్రేక్షకులముందు తన నటనా కౌశల్యం ప్రదర్శించి, మెప్పు పొందాడు.

అదేమిటోగానీ చిన్నప్పటినుంచీ జ్యూలియస్ ఫ్యూచిక్‌కు గ్రంథపఠనం అంటే ఎక్కడలేని ఆసక్తి. బడిలో ప్రవేశించక మునుపే తల్లిదగ్గర అక్షరాభ్యాసం ప్రారంభించాడు. బడికి పొమ్మంటే మారాం పెట్టేవాడుకాడు. పాఠాలు చదవటం

అంటే అతనికదో సరదా. అలాగని పుస్తకాల పురుగు అనేందుకూ వీలులేదు. చదివినంతసేపు దృష్టిపుంచి చదివేడు. తర్వాత తోటి పిల్లలతో వీధులలో ఆడుతూ పాడుతూ తిరిగే వాడు.

1913 లో అనుకుంటూ : ఫ్యూచిక్ కుటుంబం స్మిఖోవ్ నుంచి ప్లజెన్‌కు మారింది. ప్లజెన్‌లోని ఒకానొక చిన్న నాటక శాలలో తండ్రికి ఉద్యోగం కుదిరింది. ప్లజెన్ దరిదాపులలోనే స్కోడా కర్మాగారాలు వున్నాయి.

1914 ఆకురాలుకాలంలో జ్యూలియస్ ఫ్యూచిక్ తక్కువరకం ఉన్న పాఠశాలలో చేరాడు. ఆ పాఠశాలలో లాటిన్‌గానీ, గ్రీక్‌గానీ, జర్మన్‌గానీ బోధించరు. మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమైందీ ఆ సంవత్సరమే. ఆ మరుసటి సంవత్సరమే ఫ్యూచిక్ తండ్రి సైనికుడుగా స్కోడా కర్మాగారంలో చేరవలసి వచ్చింది; 1919 వరకు అతను అరణ్యం శాఖలోనే పనిచేస్తూ వచ్చాడు. రాత్రిపూట షిఫ్ట్‌లో తండ్రి పనిచేస్తుంటే, ఫ్యూచిక్ కర్మాగారానికి అన్నం పట్టుకు పోవలసివచ్చేది. కార్మికుల జీవితంఅంటే ఎలాంటిదో ఫూచిక్‌కు అప్పుడే అవగతమైంది. కార్మికుల మధ్య కానవచ్చే సౌహార్దం ఎంతటిదో గ్రహించాడు. యుద్ధం కొనసాగుతోంది. కార్మికుల కష్టాలు అంతకంతకు అధికమవుతున్నాయి.

ఒక్క మొక్కజొన్న రొట్టెముక్కకోసం, జనం తండోప తండాలుగా, బారులుదీరి గంటలతరబడి పడిగాపులు పడియున్న దృశ్యాలను స్వయంగా తిలకించాడు. తిలకించటమే కాదు. స్వయంగా అనుభవించాడు. రొట్టె కొనటానికి ఉదయానే బజా

రుకు వచ్చేవాడు. ఉదయం లేదు, మధ్యాహ్నం లేదు, సాయంత్రం లేదు. ఎప్పుడో పొద్దుగూకాక, ఇంత మొక్కజొన్న రొట్టె ముక్క చేతికొచ్చేది. దానిని చేతపట్టుకొని కాళ్లీడ్చుకుంటూ, తట్టెడు చీకటిని నెత్తినేసుకొని యింటికి చేరేవాడు. ఎక్కడ చూసినా ఎక్కడో యుద్ధరంగంలో భర్తలను కోల్పోయిన భార్యల ఆక్రందనాలు, బిడ్డలను పోగొట్టుకొన్న తల్లుల శోక పూరిత ఘోషలు, సర్వేసర్వత్రా దైన్యం, ఎటుచూస్తే అటు దుఃఖం, నిరాశ-ఇదే వరస. ఎటువిన్నా "యుద్ధం పాడుగాను"- ఇవే శాపనార్థాలు.

ఆనాటి పరిస్థితులు అలాంటివి. ముక్కుపచ్చలారని ఫ్యూచిక్ లేతహృదయంపైన ఆ భీకర పరిస్థితులు ఎలాంటి ముద్రవేశాయో వూహించుకోండి!

ఫ్యూచిక్‌కు పన్నెండోయేటనే పత్రికా రచనా వ్యాసంగం అలవడింది. మొదట 'స్లోవస్' అనే వ్రాత పత్రికను వెలువరించాడు. వియన్నానుంచి వెలువడే అధికార ప్రకటనలు, విదేశాలనుంచివచ్చే వార్తలో, సామాజిక వార్తలపై వ్యాఖ్యానాలో, రేషనింగ్‌కు సంబంధించిదన సమాచారమూ, వాటితో పాటు చిన్న చిన్న వ్యాసాలూ, సంస్కృతీ విషయాలూ, నాటక సమీక్షలూ, క్రీడారంగ వార్తలూ ఆ వ్రాతపత్రికలో వున్నాయి.

తిరిగి 1916 లో 'వేసెలా మిసిల్' (ఊసుపోని ఆలోచనలు) అనే మరొక వ్రాతపత్రికను ప్రకటించాడు. వంటింట్లో, ఏదో ఒకమూల కూర్చొని, ముద్దుమురిపెం కురిపే ముచ్చటయిన దస్తూరీతో ఆ పత్రికప్రతిని వెలుగులోకి తీసుకొచ్చాడు.

బొమ్మలు గీశాడు. అది యుద్ధకాలం. కరువు కాటకాలు, ఆకలి జ్వాలలు, భరింపలేని యాతనలు, దేశమంతా అలముకొన్న రోజులవి. అలాంటి సమయంలో హాస్యప్రధానమైనదిగా ఫ్ల్యాచిక్ ఆ పత్రికను తయారు చేశాడు. అతనికి అదెలా సాధ్యమైంది? దుర్భరమైన పరిస్థితులలో, హృదయాన్ని గట్టిగాపట్టి పిండేసే దారుణమైన పరిస్థితులలో సైతం హృదయాలకు గిలిగింతపెట్టుతూ జోలపాటపాడే మధురమైన హాస్యం చిలికించటం అతనికి ఎలా సాధ్యపడింది? ఫ్ల్యాచిక్ విశిష్టత, విశేషం ఇందులోనేవుంది. అత నెన్నడూ నిరాశకు లోనుకాలేదు. అవరోధాలను, అడ్డంకులను ఎల్లప్పుడు అధిగమిస్తూ వచ్చాడు. అంధకారంలో ఆశాజ్యోతిని చూడగలిగేవాడు. తల్లికీ, తండ్రికీ, ఇరుగు పొరుగువారికీ తన పత్రికద్వారా ఆనందం, ఆహ్లాదం చేకూరటమే అతని అభిమతం. "ప్రస్తుత కష్టదశను వారు మర్చిపోగలిగేటట్లు చేయాలి"— అదే అతని ఉద్దేశం.

పధ్నాలుగోయేట ఫ్ల్యాచిక్ 'జెక్' అనే యింకొక వ్రాతపత్రికను ప్రకటించాడు. అందులో సాహిత్య సమీక్షలు ప్రధానంగా వున్నాయి. అతని ఆసక్తి, అభిరుచులు ఎంత విస్తృతమైనవో, విస్తారమైనవో, మరెంత ప్రగాఢమైనవో అందులో మనకు సువ్యక్త మవుతాయి. చూడముచ్చటగా వుంటుంది అతని దస్తూరీ.

19 వ శతాబ్ది జెక్ మహాకవి కారెల్ హావాలీసెక్ బొరోవస్కీ రచించిన "ట్రాల్ ఎలిగీస్" అన్న గేయం అంటే ఫ్ల్యాజక్ కు ఎంతోయిష్టం. అందుకే, స్వదస్తూరితో చక్కగా వ్రాసుకొని దానిని భద్రపచ్చుకొన్నాడు. ఆస్ట్రియా రాజరి

కంపై ఆ గేయం నిప్పులు చెరగింది. [1918 వరకు చెకోస్లావా కియా ఆస్ట్రియా రాజరికం పాలనలోనే వుంది-అను] ఉదాత్తమైన జాతీయ విమోచనా కాంక్ష ఫ్యూచిక్‌లో చిన్ననాటనే పొటమరించింది. కాలదోషం పట్టిన రాజరికాన్ని అతను తీవ్రంగా ద్వేషించసాగాడు.

1917 లో రష్యాలో విప్లవ ఘటనలు సంభవించాయి. దానితో దేశదేశాలలోని కార్మికులు ఉత్సాహం, ఉత్తేజం పొందసాగారు. అభ్యుదయకరవాదులలో ఆత్మవిశ్వాసం పుంజుకొంది. ప్లజెన్‌లోని స్కోడా కార్మికులలో విప్లవభావాలు అసలే మెండు. యుద్ధానికీ, దోపిడీకీ ప్రతికూలంగా వారు పలు మార్లు సమ్మెచేశారు. ప్లజెన్‌కు సమీపంలో గల ఒక మందు గుండు కర్మాగారంలో 1917 మే 22 వ తేదీన పెద్ద మందు గుండు ప్రేలుడు సంభవించింది. ఆ ప్రమాదంలో 400 మంది కార్మికులు దుర్మరణం పాలయ్యారు. స్కోడా కార్మికుల కడుపు మండిపోయింది. ఆస్ట్రియాపట్ల వారిలో ద్వేషానలం రగులుకొంటోంది. పరిస్థితులలోని తీవ్రతను ఆస్ట్రియా అధికారులు పసికట్టారు. ప్లజెన్ ప్రాంతాన్ని పెద్ద సైనిక శిబిరంగా మార్చివేశారు. పధ్నాలుగేళ్ల ప్రాయంలో వున్న ఫ్యూచిక్ చిరు హృదయంపైన ఈ ఘటన లన్నింటి ప్రభావం ముద్రితమైంది. స్కోడా కర్మాగారంలో పనిచేస్తున్న కార్మికులలో జెక్ దేశస్థులూ వున్నారు; పోలెండ్ దేశీయులూ వున్నారు. జర్మనులు హంగేరియన్లూ, క్రోషియన్లూ వున్నారు. దేశాలు వేరైనా, వారంతా 'ఒకేమాట, ఒకేబాట' అనుసరించటం చూశాడు

ఫ్యూజిక్. ఆ కార్మికులంతా సోదరులవలె మెలగటం చూసి ముగ్ధుడయ్యాడు.

రష్యాలో అక్టోబరు సోషలిస్టు మహావిప్లవం జయప్రద మైంది. అటుతర్వాత వచ్చిన తొలి మే దినోత్సవాన్ని-1918 మే 1-ప్రాగ్ కార్మికులు బ్రహ్మాండంగా జరుపుకొన్నారు. ప్రపంచంలో అవతరించిన మొట్టమొదటి సోషలిస్టు దేశానికి వారు ఆ నాడు హృదయం విప్పి స్వాగతం పలికారు. అప్పటికి ఫ్యూజిక్‌కు పదిహేనేళ్లు వచ్చాయి. అరోఘారం చదువు తున్నాడు. ఆ మే దినోత్సవ ప్రదర్శనలో స్వయంగా పాల్గొన్నాడు. స్వయంగా పాల్గొనటమేకాదు; తన సహపాఠకులందరికీ చెప్పి, ఒప్పించి ఊరేగింపులోకి తీసుకొచ్చాడు.

అదే సంవత్సరం జూన్ 22వ తేదీన మరొక దారుణ మైన సంఘటన జరిగింది. ప్లజెన్‌లో ఒక చోట ఆరోజున సైని కులు రొట్టెలను లారీలలోకి ఎక్కిస్తున్నారు. అదిచూచిన అనాథలైన అనేకమంది పిల్లలు ఆలాకించుట్టూ మూగారు. 'ఆకలేస్తోంది, చిన్న రొట్టిముక్క యివ్వరూ? అంటూ ఆపసి కందులు ప్రాధేయపడ్డారు. దయ, కరుణ పూర్తిగా యింకి పోయిన ఆ సైనికులు వసేమీ యివ్వం పొమ్మన్నారు. ఆకలితో తల్లడిల్లిపోతున్న ఆపిల్లలు లారీపైకి ఎగబడి రొట్టెలు తీసుకో ప్రయత్నించారు. వెంటనే "శాంతి భద్రతలు" కాపాడ టం కోసం సైనికులు తుపాకులు ఎక్కుపెట్టి టపా టపా పేల్చా రు. తల్లడిల్లిన పసిపిల్లలు చెల్లా చెదురై పోయారు. సైనికుల తుపాకీ కాల్పులకు బాల ప్రాణాలు అయిదు బలి అయి

పోయాయి. ఈ రాక్షస దృశ్యాన్ని ఫ్యూచిక్ స్వయంగా చూశాడు.

ఈ వార్త విన్న స్కోడా కార్మికులు ఉద్రిక్తులైపోయారు. వెంటనే సార్వజనీన సమ్మెకు పిలుపు యిచ్చారు. ఈ ఘటన అన్నింటికి ప్రభావం ప్రసరించిన ఫ్యూచిక్ 1918 ఆగస్టు 5 వ తేదీన ఈ క్రింది గేయం రచించాడు.

పీ డ కు లు :

"ఏమిటీ గొడవ? ఎందుకీ గోల?
లోకంలో ఆకలిరాజ్య మేలుతోందా?
ఫర్వాలేదు. అందుకు వుంది లేమందు
జైలు, కాకుంటే ఉరికంబం"

పీ డి తు లు :

"అవును మహానుభావులు మీరు
మీ నోటివాక్కు నిజమే కావచ్చు:
మేమూ నవ్వుతాములే, నమ్మండి మా మాట
ఉరితీతాము మీ మెడనుపడే సుదినాన."

ఒక వ్యక్తిని వేరొకవ్యక్తి, ఒక జాతిని యింకొక జాతీ పీడించే సాంఘికధర్మం అంటే ఫ్యూచిక్ హృదయంలో ఎంత ద్వేషం వుందో పై వాక్యాలు స్ఫురింప చేస్తున్నాయి. కార్మిక వర్గానికి అండగా, అన్నార్తులకు బాసటగా కడకంటా నిలబడ్డ యోధుడుగా తన జీవిత పర్యంతం జీవితం గడుపుతానని

ఫ్యూచిక్ శపథం చేశాడు. చేసిన శపథాన్ని చివరిశ్వాసందాకా పాటించాడు. ప్రపంచాన్ని మార్చటంకోసం సర్వశక్తులు ధార పోశాడు.

ప్లజెన్‌లో కార్మిక - విద్యార్థి సంఘం స్థాపించాడు. రష్యాలో జరుగుతూన్న విప్లవ పరిణామాలకు సంబంధించిన నిజసమాచారాన్ని ఎలాగో సంపాదించి, తన దేశంలో నూతన సోషలిస్టు రాజ్యానికి వ్యతిరేకంగా సాగుతున్న నిందా ప్రచారాన్ని ఎదుర్కొన్నాడు. సత్యసాధనే ఫ్యూచిక్ జీవిత పరమాశయంగా పెట్టుకొని జీవించాడు.

1918 అక్టోబరు 28 వ తేది. ఆ రోజున చెకోస్లావాక్ రిపబ్లిక్ అవతరించింది. తన దేశ ప్రజలందరికీ ఇక స్వేచ్ఛ చేకూరినట్లేనని ఫ్యూచిక్ సంబరపడ్డాడు. కొన్ని సంవత్సరాల తర్వాత, 1933 లో, ఆ రోజును ఇలా జ్ఞాపకంచేసుకొన్నాడు.

"సాయం సమయం. కార్మిక–విద్యార్థి సంఘం సమావేశమవుతోంది. పరిస్థితిని చర్చిస్తున్నాం. విక్టర్ డైక్, స్వాతోప్లక్ గీతాలనుంచీ, కమూనిస్టు ప్రణాళికనుంచి, సభ్యులు కొన్ని భాగాలను ఉట్టంకించుతున్నారు. ప్రసంగాలు ఉద్వేగ పూరిత వాతావరణంలో సాగుతున్నాయి. నడిరాత్రి రానేవచ్చింది. ఎదురింటిలో నివసిస్తున్న కార్మికుడు సోషల్ డెమొక్రాట్ పార్టీ కార్యకర్త. నాకునిద్రపట్టలేదు. అతన్ని నిద్రనుంచిలేపాను. సంగతి చెప్పాను. త్వరత్వరగా దుస్తులు ధరిస్తున్నాడు. అనేక ప్రశ్నలువేసి వేధించాడు: స్వేచ్ఛా! స్వాతంత్ర్యమా! నిజంగా? ప్రకటించింది ఎవరు? ఆధిపత్యం ఎవరిది? అవన్నీ అర్థం లేని ప్రశ్నలుగా కనిపించాయి. ప్రకటించింది ఎవరైతేనేమి! అధి

పత్యం ఎవరిదైతేనేమి? అతనికి ప్రజలలో బొత్తిగా విశ్వాసం లేనట్టుంది. ఉద్వేగపూరిత ధోరణిలో అతను నాకు వివరించి చెప్పసాగాడు. ఆధిపత్యం ఎవరిది? కొత్తగా స్వాతంత్ర్యం వస్తున్న దెవరికి? ఈ రెండూ చాలాముఖ్యమైన విషయాలన్నాడు. నాకేమీ అర్థంకాలేదు. ఎందుకో ఆ అనుమానం? స్వాతంత్ర్యం మనందరికీ వచ్చిందాయే. మరి మనకుకాక యింకెవరికివచ్చినట్టు? అతను నావంక అదోమాదిరిగా చూశాడు. పెదిమలు విరిచాడు: 1918 అక్టోబరు 28 అర్ధరాత్రి సమయాన చూసిన ఆ వ్యక్తిని ఎలా మరచిపోగలను?"

జెక్ ప్రజలను పీడించుకొని తింటున్న ఆస్ట్రియా - హంగెరీ రాజరికం ఫ్యూజిక్ మనస్సులోవుంది. కార్మికులను నిలువునా కాల్చి చంపటం స్వయంగా చూశాడు. అన్యాయం సామాజిక హెచ్చుతగ్గులు రాజ్యమేలటం కళ్లారా కాంచాడు. సాంస్కృతిక అభివృద్ధి నిరోధక తత్వం, పత్రికా నిర్బంధాల విలయనర్తన, తిలకించాడు. ఇలాంటివి కొత్తరాజ్యంలో నామ రూపాలు లేకుండా పోతాయని ఫ్యూజిక్ ఆనాడు ఆశించాడు. కాని కొత్తగా ఏర్పడిన ప్రభుత్వం ప్రజలకు ద్రోహం తల పెట్టింది. సోషల్ డెమోక్రాట్లలోని మితవాదులు సోషలిజానికి విడాకులిచ్చి, విద్రోహానికి ఒడిగట్టారు.

కార్మికవర్గానికి అత్యంత సన్నిహితంగా వుంటూ, శ్రమ జీవుల ఆశలనూ, ఆశయాలనూ ఫ్యూజిక్ పంచుకొన్నాడు. విప్లవభావాలకోసం ప్రాణాలనుసైతం పణంగా పెట్టటానికి వెనుదీయనని శపథం పూనాడు. అందుకే కమ్యూనిస్టుపార్టీలో చేరాడు. మాతృదేశాన్ని, కష్టజీవులను, సత్యాన్ని, న్యాయాన్ని

అమితంగా ప్రేమించాడు. అందుకనే సోషలిస్టు ఆశయాలు అతనికి పూర్తిగా నచ్చాయి. సమున్నత ఆశయాలకోసం తుది కంటా దృఢవిశ్వాసంతో నిలబడి పోరుసాగించాడు. సోవియట్ యూనియన్ అవతరణ ఫ్యూజిక్ విశ్వాసం మరింత దృఢతరం కావటానికి దోహదమిచ్చింది.

ఇంతప్పటినుంచీ గ్రంథపఠనం అంటే ఫ్యూజిక్ కు నిక్కుడలేని అభిరుచి. వందలకొలదీ గ్రంథాలు చదివాడు. 1919–1922 మధ్యకాలంలో అతను చదివిన గ్రంథాలను ఒక సారి పరికిస్తే, ఆ నాడు అతని ఆలోచనాధోరణి ఏలావుండేదో మనకు యిట్టే బోధపడుతుంది: బాల్జాక్, బాడ్లెయిర్ బరన్స్, బైరన్, కాష్ట్రూస్కీ, కార్నిలీ, దోస్టవస్కీ, ఫ్లాబర్ట్, అనటోల్ ఫ్రాన్సు, గోథే, గొగోల్, గోర్కీ, హీన్, ఇబ్సన్, జారే, కొరొలెంకో, లెనిన్, లెర్మాన్టోవ్, మార్క్స్, మోలియర్, పుష్కిన్, రోమారోలా, షా, షేక్స్పియర్, షెల్లీ షిల్లర్, సోఫోకల్స్, టాల్స్టాయ్, టర్జినీవ్, వోల్టైర్, విట్మె జోలా మున్నగు ప్రముఖుల రచనలను ఫ్యూజిక్ చదివాడు. అలాగే జెక్ రచయితలైన అలాయిస్ జరాసెల్, బోజెనా నెమ్కోవా, జాన్ నెరూడా, ఆంటోనిన్ సోవా జిరీవాకర్ తది తర ప్రముఖుల రచనలనుకూడా చదివాడు. ఈ పుస్తకాల పేర్లన్నింటినీ ప్రత్యేకంగా తన నోట్ పుస్తకాలలో వ్రాసు కొన్నాడు. వాటిపైన విమర్శనా పూర్వకమైన వ్యాఖ్యానా లనుకూడా కొద్దికొద్దిగా వ్రాసుకొన్నాడు. అంతేకాదు. ఆ రోజులలో ప్రదర్శితమైన నాటకాలపైన తన అభిప్రాయాలను కూడా ఉల్లేఖించాడు.

1920 లో ఫ్యూజిక్ 6 వ ఫారం చదువుతున్నప్పుడు, ప్లెజెన్ లో 'ప్రావ్దా' సహకార ప్రచురణాలయం సంస్థ స్థాపించ బడింది. ఆ సంస్థ తరఫున 'ప్రావ్దా' పత్రికను అతివాద సోషల్ డెమొక్రాట్లు ప్రారంభించారు. ఫ్యూజిక్ ఆ పత్రికలో చేరాడు. ఆ తరువాత 1921 లో అతివాద సోషల్ డెమోక్రట్లు కమ్యూనిస్టుపార్టీని స్థాపించారు. 18 వ యేట ఫ్యూజిక్ కమ్యూనిస్టుపార్టీ సభ్యుడయ్యాడు.

1921 ఆకురాలు కాలంలో, ఉన్నత విద్య నభ్యసించే నిమిత్తం ఫ్యూజిక్ ప్రాగ్ విశ్వవిద్యాలయంలో చేరాడు. చదువు కొనసాగించటానికి చేతులో డబ్బులేదు. అంత మాత్రాన అతను నిరాశ చెందలేదు. కష్టపడి పనిచేసుకొంటూ, డబ్బు సంపాదించి చదువు సాగించాలని సంకల్పించుకొన్నాడు. ఒకానొక ప్రభుత్వ కార్యాలయంలో ఆఫీసు బాయ్ గా చేరాడు. ఒకప్రక్క ఆఫీసుబాయ్ గా పనిచేస్తూ, మరొకప్రక్క విశ్వవిద్యాలయంలో తత్వశాస్త్రం అభ్యసించసాగాడు. వివిధ దేశాలలో సాహితీ వికాసమెట్టిది? కళాప్రాభవం వెల్లివిరిసిన తీరు తెన్ను లెలాంటివి? మున్నగు విషయాలను పరిశోధించాడు. అదే సమయంలో ప్లజెన్ కమ్యూనిస్టు కమిటీ అధికార పత్రికయైన ప్రావ్దాకు వ్యాసాలు వ్రాస్తూండేవాడు. జెక్ కవిశ్వరుడైన జిరీవోకర్ (1900 – 1924) రచనల గురించిన విమర్శనాత్మక పరిశీలనను ప్రకటించాడు.

ఆ దశను గురించి ఫ్యూజిక్ ఇలా ఉదహరించాడు:

"యుద్ధకాలంలో నేను పెరిగి పెద్దవాణ్ణయ్యాను. చిన్న వయస్సులో వున్నవాడు యుద్ధ దుష్ఫలితాలను అంత తేలికగా

మరచిపోలేను. యుద్ధం ప్రారంభమైననాటికి నాకు పన్నెండేళ్లన్నా నిండలేదు. యుక్తవయస్సు రాకముందే ఆ యుద్ధం ముగిసింది. అయినా ఆ యుద్ధకాలపు అనుభవాల్లో పుట్టిపోయిన నాకు పాతికేళ్లు నిండాయనిపించింది. తమకు యిష్టం లేకపోయినా ప్రజలు పరస్పరం చంపుకోవలసిన స్థితి ఏర్పడిందంటే, ప్రపంచంలో ఏదో లోపం, ఎక్కడో వుందన్నమాట. అలాంటి పరిస్థితి చూస్తూంటే, నిజంగా నాకు విపరీతమైన ఏవగింపు గల్గింది. పుస్తకాలలోను, నాటకాలలోను చాలావరకు నేను మునిగి తేలుతూండేవాణ్ణి. సత్యంఅన్నది ఏఏ గ్రంథాలలో లభిస్తుందా అని గాలించాను. కొన్నిట్లో కన్పించింది. మరికొన్ని గ్రంథాలు పచ్చి అబద్ధాలపుట్టగా గోచరించాయి. ఇంకొన్ని గ్రంథాలు మూగవిగా కన్పించాయి. అబద్ధాలమయంగా వున్న గ్రంథాలుగానీ, మూగవోయిన గ్రంథాలుగానీ ఎందుకూ పనికిరావని గొంతెత్తిచాటాలని బుద్ధిపుట్టింది. మహోజ్జ్వల భవిష్యత్తుకోసం కృషిచేయటం నా విద్యుక్త ధర్మంగా ఎంచుకొన్నాను. అందుచేతనే గ్రంథాలనుగురించీ, నాటకాలనుగురించీ వ్రాయటానికి ఉపక్రమించాను.”

గ్రంథపఠనను ఫ్యూజిక్ విరమించలేదు. ప్రత్యేకించి చేతికందిన మార్క్సిస్టుగ్రంథా లన్నింటినీ అధ్యయనం చేశాడు. “విద్యార్థి తాత్విక సమాఖ్య” అనే సంస్థ కార్యకలాపాలలో ప్రగతిశీలురతోపాటు కలిసి అతను పాల్గొన్నాడు. సమ్మెను ప్రోత్సహించాడనే నేరం ఆరోపించి, 1923 లో అతనిని ఆఫీసుబాయ్ ఉద్యోగంనుంచి బర్తరఫుచేశారు. దానితో బ్రతుకుతెరువుకు మరొక మార్గం తడుముకోవలసి వచ్చింది.

మోతకూలీగా పనిచేయసాగాడు. కూలీపనులు చేస్తూనే మరోపక్క 'సోషలిస్టా', 'ప్రామెన్'వంటి ప్రగతిశీల పత్రికలకు ఫ్యూజిక్ వ్యాసాలు వ్రాశాడు.

జూలియస్ ఫ్యూజిక్, జస్ స్వోర్క్స్, ఇవాన్ సేకసేనా – ఈ ముగ్గురూ కలిసి 1925 లో 'అవంత్ గార్డా' అనే విప్లవకర పత్రికను ప్రారంభించారు. ఆ పత్రికను సరసంగ సుందరంగా తయారు చేయటంలో ఫ్యూజిక్ ముఖ్యపాత్రను నిర్వహించారు. అంతేకాదు.. సేకనీ వారితో కలిసి ఫ్యూజిక్ విద్యార్థులలో ఆ పత్రిక ప్రతులను స్వయంగా అమ్ముతుండే వాడు.

కమ్యూనిస్టుపార్టీ అధికారపత్రికయైన 'రూడ్ప్రావో'లో నాటక సమీక్షలు 1925 లో ప్రకటితం కాజొచ్చాయి. 1927–1929 మధ్యకాలంలో 'క్మెన్' అనే పత్రిక సంపాదకుడుగా పనిచేశాడు. లాభార్జనసే ప్రధానంగా ఎంచుకొన్న ఆ పత్రిక యజమానులకు, ఫ్యూజిక్ సోషలిస్టు భావాలకు మధ్య పొత్తుకుదరలేదు. కనుక ఆ పదవికి ఫ్యూజిక్ రాజీనామా చేశాడు.

1928 నవంబరు. ఇక నెలరోజులలో ఎన్నికలు ప్రారంభం కాబోతున్నాయి. కమ్యూనిస్టుపత్రిక లన్నింటినీ ప్రభుత్వం నిషేధించింది. ఆ విధంగా ప్రజావాణిని నొక్కివేయవచ్చుననీ, కమ్యూనిస్టు ప్రచారాన్ని అరికట్టవచ్చునని ప్రభుత్వం తలంచింది. ఎఫ్. ఎక్స్. సాల్డా, ఫ్యూజిక్ల సహసంపాదకత్వాన అప్పట్లో 'త్వోర్బా' అనే పత్రిక వెలువడుతోంది. ప్రభుత్వ కుతంత్రాలను సాగనీయరాదని నిశ్చయించిన ఫ్యూజిక్ సాల్డా వద్దకువెళ్ళి, ఈ క్రిందిసూచన చేశాడు: "త్వోర్బా పత్రికను

కమ్యూనిస్టుపార్టీకి ' అప్పగిద్దాం'' అందుకు సాల్డా అంగీకారం తెల్పుతూ ఇలా అన్నాడు: "సరే; ఏమైనాసరే నీ వాణి మాత్రం మూగబోయేందుకు వీలులేదు''

1928 నవంబరు 4వ తేదీన కొత్త వారపత్రిక 'త్వోర్బా' తొలి సంచిక వెలువడింది. అందులో సాహిత్య, కళా, రాజకీయవిషయాలపైన వ్యాసాలున్నాయి. ఇదే సమయంలో 'రూద్ ప్రావో' 'రుదీ వెసెర్ నిక్' పత్రికలలోకూడా పనిచేస్తూ వచ్చాడు. విప్లవాశయ సాధనకు ఫ్యూజిక్ తన ప్రతిభను, ఉపజ్ఞను పూర్తిగా వినియోగించాడు.

అతను 18 వ యేటనుంచి విప్లవకరపాత్రికేయుడుగా అభివృద్ధి చెందుతూవచ్చాడు. మొదట నాటకాలపై సమీక్షలు. ఆటుతర్వాత సాహిత్య విమర్శలు చేస్తూ వచ్చాడు. అనంతరం రాజకీయ వ్యాఖ్యాతగాను, విలేఖరిగాను పనిచేయసాగాడు. రాజకీయాలలో తలమార్చినంతమాత్రాన సాంస్కృతిక,సాహితీ నాటకాది విషయాలలో అతనికి ఆసక్తి లేకుండా పోలేదు. సంస్కృతికీ, రాజకీయాలకు అవినాభావసంబంధం వుందని ఫ్యూజిక్ మొదటినుంచీ వాదిస్తూ వచ్చాడు.సాంస్కృతిరంగంలో ప్రసిద్ధులైన అనేకమందితో చర్చలుసాగించి, వారిని కమ్యూనిస్టు పార్టీ కార్యవిధానానికి అనుకూలంగా మార్చాడు.

1929 లో పెట్టుబడిదారీ దేశాలన్నింటిలో మాదిరిగానే, జెకొస్లొవాకియాలోకూడా ఆర్థిక సంక్షోభం అలముకొంది. నిరుద్యోగం పెచ్చుపెరిగిపోయింది. కార్మికులు మరింత కటికి దారిద్ర్యం అనుభవించవలసివచ్చింది. అదే సంవత్సరం ఆకురాలుకాలంలో ఉత్తర బొహీమియాలోని గని కార్మికులు

సమ్మె ప్రారంభించారు. 'హూద్‌ప్రావో' విలేఖరిగా ఫ్యూజిక్ ఉత్తర బొహీమియాకు పంపించబడ్డాడు. సమ్మె కొనసాగుతున్నంత కాలమూ అతను అక్కడే ఉండిపోయాడు. సమ్మె కార్యాచరణ సమితి సమావేశాలలో పాల్గొన్నాడు, మొత్తం ప్రభుత్వ యంత్రమంతా గని యజమానులకు పూర్తి మద్దత్తు యిచ్చింది. అందువల్ల కార్మికులు భీషణపోరాటం సాగించవలసివచ్చింది. సమ్మె విచ్ఛిన్నకారులు గనులలోకి ప్రవేశించకుండా గని కార్మికులతోపాటు ఫ్యూజిక్ కూడా పికెట్ చేశాడు. ప్రభుత్వం అతనిని నానా యిబ్బందులకు గురిచేసింది 'హూద్‌ప్రావో'పంపిన వార్తలను అధికారులు తొక్కిపట్టారు. కార్మికులజీవనస్థితిగతులను చిత్రిస్తూ వ్రాసిన వ్యాసాలను అధికారులు అంతూ అయిపూ లేకుండా చేశారు. ఆ సమ్మె సాగినంతకాలమూ 'స్ట్రాకా' (సమ్మె) అనే పత్రికను ఫ్యూజిక్ రహస్యంగా నడిపాడు. ఆ పత్రిక జర్మన్, జెక్, భాషలలో వెలువడుతుండేది. ఆ పత్రిక సంపాదకుణ్ణి పట్టుకోవాలని పోలీసులు నానా తంటాలు పడ్డారు. అయినా ప్రయోజనం లేకపోయింది. ఆ పత్రికను నడుపుతున్నది ఫ్యూజికేనని గని కార్మికులకు పూర్తిగా తెలుసు. అయినా ఆ సంగతిని వారు కడుపులోనే దాచుకొన్నారు.

ఫ్యూజిక్‌కు అత్యంత ప్రియతమమైన అభిలాష ఒకటుంది. అది 1930 లో నెరవేరింది. ఏమిటా అభిలాష? ప్రపంచంలో మొట్టమొదటగా నూతన సమాజం, సోషలిస్టు సమాజం స్థాపితమైన సోవియట్ యూనియన్‌ను ఎప్పుడు సందర్శించగలనా, అని అతను ఉవ్విళ్లూరుతూ వుండేవాడు. ఎట్టకేలకు 1930 లో నలుగురు కార్మిక ప్రతినిధులతో కలసి సోవియట్

యూనియన్‌కు బయలుదేరారు. ఆ అయిదుగురిలో ఒకరికి కూడా ప్రభుత్వం ప్యాస్‌పోర్టు యివ్వలేదు. పైగా, ఎలాగైనా సరే వారు సోవియట్ యూనియన్ చేరకుండా అరికట్టాలని అధికారులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. అధికారులకళ్లు గో కారం కొట్టి ఆ అయిదుగురు ప్రతినిధులు రహస్యంగా దేశ సరిహద్దులు దాటారు. ముందు జర్మనీ వెళ్లి, అక్కడనుంచి నావలో లెనిన్‌గ్రాడ్‌కు చేరుకొన్నారు. ఫ్యాజిక్ నాలుగు మాసాలపాటు సోవియట్ యూనియన్‌లో పర్యటించాడు. లెనిన్‌గ్రాడ్‌నుంచి మాస్కో, యూక్రెయిన్, స్టాలిన్‌గ్రాడ్, మధ్యఆసియా, ఫ్రూంజ్‌ల మీదుగా చైనా సరిహద్దులదాకా అతను యాత్ర సాగించాడు. సోవియట్ దేశాన్నీ సోవియట్ ప్రజలను చూసి, అతను అమితోత్తేజం పొందాడు. తరతరాలుగా మానవోత్తములంతా కన్నకలలు, స్వేచ్ఛా మానవుడు తన మనోఫలకంపై చిత్రించుకొంటూ వచ్చిన మధురభావనలు సోవియట్ యూనియన్‌లో నిత్య సత్యాలుగా అలరారుతుండటం చూశాడు. ఒక వ్యక్తిని వేరొక వ్యక్తి పీడించే సాంఘిక ధర్మం ఆ దేశంలో చలామణిలో లేదు. సంక్షోభాలపీడ, నిరుద్యోగ వ్యథ, ఆకలిబాధ ఆ దేశంలో మటుమాయమైపోయాయి. తన పర్యటనానుభవాలను అతను ఇలా వివరించాడు: "ఇలాంటి స్వేచ్ఛ నేనెన్నడూ అనుభవించలేదు...ఇక్కడ ఎంత ఆనందదాయకంగా వుంది! నేను ఇంతకుముందు ఊహించుకొన్నదానికన్న మిన్నగా వుంది ఇక్కడ పరిస్థితి. అందరికీ నా అభివందనాలని చెప్పు, ఇక్కడ అవతరించిన ప్రజారాజ్యంవంటి

దానికోసం పోరాడుతూ ఎంతటి మూల్యం చెల్లించినా దండగ లేదని అందరికీ చెప్పు!!

సోవియట్ జీవితం పట్ల, సోవియట్ ప్రజల పట్ల అచంచల విశ్వాసంతో జ్యూలియస్ ఫ్యూజిక్ స్వదేశం తిరిగివచ్చాడు. ఉత్సాహం, ఉత్తేజం అతనితో విద్యుత్ వాహినిలా ప్రవహించాయి. కార్మికులతో ముచ్చటించినా, సభలలో ప్రసంగించినా, పత్రికలో వ్యాసాలు వ్రాసినా అదే విషయం: "రేపు నిన్నగా మారిన దేశం" గురించి ప్రత్యేకంగా పుస్తకంకూడా వ్రాశాడు. ఒకానొక బహిరంగసభలో ప్రసంగిస్తుండగా, పాస్‌పోర్టు లేకుండా సోవియట్ రష్యా వెళ్లివచ్చినందుకు అతన్ని పోలీసులు అరెస్టుచేశారు; శిక్ష విధించారు. సోవియట్ యూనియన్ పైన ప్రభుత్వమూ, పత్రికలూ పనికట్టుకొని రకరకాల దుష్ప్రచారాలను సాగించారు. ఆ దుష్ప్రచారాలను ఫ్యూజిక్ దుయ్యబట్టుతూ పలుసభలలో ప్రసంగించాడు. సోవియట్ యూనియన్‌లో జెక్ ప్రతినిధివర్గం పర్యటిస్తున్న సందర్భంలో ఒక సోవియట్ యువకుడు వచ్చి తమను ఈ క్రింది విధంగా ప్రశ్నించాడని ఫ్యూజిక్ ఒకానొక సభలో వెల్లడించాడు: "మీ దేశంలో ప్రభుత్వం పసిపిల్లలను కాల్చి చంపుతుంటుందని పత్రికలలో చదివాం. అలాంటిది మా దేశంలో సంభవించదు! ఆ వుదంతాన్ని ఫ్యూజిక్ యేకరువు పెట్టినందుకు, జెక్ ప్రభుత్వం అతనికి పదిహేను రోజుల జైలు శిక్ష విధించింది. కాని, అదే సంవత్సరం ఏప్రియల్‌లో రాదోతిన్ సమీపంలో కార్మిక ప్రదర్శనలలో పాల్గొన్న పసి పిల్లలను జెక్ పోలీసులు కాల్చి చంపారు.

అప్పట్లో ప్రతి యువకున్నీ సైనిక సేవలోకి నిర్బంధంగా ప్రభుత్వం తీసుకొంటూండేది. ఆ ప్రకారం 1930లో ఫ్యూజిక్ ను కూడా సైన్యంలోకి తీసుకొన్నారు. అయితే కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు సైన్యంలో వుండేందుకు వీలులేదు. కనుక అతనిని ప్రభుత్వం వెంటనే తిప్పి పంపివేసింది. సైన్యంలోనుంచి తిరిగి రాగానే ఫ్యూజిక్ మళ్లీ ప్రారంభించాడు: బహిరంగసభలు ఏర్పాటు చేసి, సోవియట్ యూనియన్‌ను గురించి చెప్పసాగాడు. పత్రికలలో వ్యాసాలు వ్రాయసాగాడు. 1931 లో అనేకమందితో కూడిన మరొక యువజన ప్రతినిధి వర్గాన్ని ఫ్యూజిక్ రహస్యంగా జెక్ సరిహద్దులను దాటించి, బెర్లిన్ మీదుగా రష్యాకు పంపించాడు; తానుమాత్రం బెర్లిన్‌లోనే దిగబడి పోయాడు. బెర్లిన్ నుంచి స్వదేశానికి తిరిగివస్తుండే పోలీసులు అతనిని అరెస్టుచేశారు. పాంక్రాస్ జెయిలులో బంధించారు.

1932 వసంతకాలంలో ఉత్తర బొహీమియా గని కార్మికులు తిరిగి పెద్ద యెత్తున సమ్మె ప్రారంభించారు. ఫ్యూజిక్ కు ఆ ప్రాంతం అత్యంత ప్రియతమమైనది. కనుక వెంటనే అతను అక్కడకు వెళ్లాడు. గనికార్మికుల పోరాటాలను గురించి అనేక వ్యాసాలు వ్రాశాడు. కార్మికులపక్షం వహించమని అభ్యుదయ రచయితలను ఉత్తేజపర్చాడు.

1932 లో తిరిగి ఫ్యూజిక్ ను సైన్యంలోకి తీసుకొన్నారు. కమ్యూనిస్టు కనుక అతనికి సైనిక శిక్షణ గరపటం సైనికాధికారులకు యిష్టంలేదు. అందువల్ల అతనిని ఒక యూనిట్ నుంచి మరొక యూనిట్ కు పదేపదే మారుస్తూ వచ్చారు. తన సైనిక జీవితాన్ని గురించి ఫ్యూజిక్ ఇలా వ్రాశాడు:

"ఒకేసారి అనేకమంది సైనికులతో నేను మాట్లాడ రాదని అధికారులు నిషేధించారు. పౌరదుస్తులలో వున్నవా రెవ్వరితోను మాట్లాడకూడదని నన్ను ఆజ్ఞాపించారు. కనుక ఇదివరకు 'రూడేప్రావో' పత్రికా సంపాదకుడుగా పనిచేశానన్న విషయాన్ని ఎవరికీ చెప్పరాదని ఆదేశించారు."

కాని, ఫ్యూజిక్ నోరు నొక్కేయటం ఎవరితరం? 1933 జనవరిలో 'త్వోర్బా' పత్రికలో ఫ్యూజిక్ కథ ప్రకటిత మైంది. స్లోవక్ గ్రామాలలో సాగుతున్న దోపిడీ, అక్కడి ప్రజల దారిద్ర్యం కళ్లకు కట్టినట్లు ఆ కథలో చిత్రించబడ్డాయి.

1933 లో సైన్యంనుంచి అతనిని విడుదల చేశారు. కాని, సైనిక బారకాసుల ఆవరణనుంచి అడుగు బయట పెట్టాడో లేదో వెంటనే పోలీసులు అతనిని అరెస్టుచేసి, పాంక్రాస్ జైలుకు తీసుకుపోయారు. న్యాయశాస్త్రాలలో గల లొసుగులను చక్కగా వినియోగించుకొని, శిక్షపడకుండా తప్పించుకోగలిగాడు. అతనిపై మోపిన అభియోగాలు నిరా ధారమైనవని న్యాయస్థానం తీర్పు యిచ్చింది. 'రూడెప్రావో', 'రూడివెసెర్నిక్' పత్రికలపైన ప్రభుత్వ నిర్బంధాలు మితి మీరిపోయినందువల్ల, కమ్యూనిస్టుపార్టీ 'హాలోనోవినీ' అనే కొత్త రాజకీయ సాంస్కృతిక దిన పత్రికను స్థాపించింది. ఆ దిన పత్రికకు ఫ్యూజిక్‌ను ప్రధాన సంపాదకుడుగా నియమించింది. ఆ సమయంలో అతను రహస్య జీవితం గడపవలసివచ్చింది. కనుక అనేక మారుపేర్లతో వ్యాసాలు ప్రకటిస్తూ వచ్చాడు. ఆ విధంగా 1934 వరకు అతను రహస్య జీవితమే గడిపాడు.

1934 లో రూడె ప్రావో విలేఖరిగా సోవియట్ యూనియన్‌కు బయలుదేరి వెళ్లాడు.

సోవియట్ యూనియన్‌లో రెండేళ్లున్నాడు. అనేక వేల మైళ్లు ప్రయాణంచేసి, సోవియట్ యూనియన్‌లోని నూతన ప్రజాజీవితాన్ని చిత్రిస్తూ అనేక వ్యాసాలు వ్రాశాడు. ఆ వ్యాసాలే 1949 లో "ప్రియతమ దేశంలో" పేరిట గ్రంథ రూపంలో వెలువడ్డాయి. తను మొదటిసారి సందర్శించిన సోవియట్ యూనియన్‌కు, రెండోసారి తిలకించిన సోవియట్ యూనియన్‌కు మధ్యగల తేడాను ఫ్యూజిక్ ఇలా వర్ణించాడు;

"మానవుడు. మానవుని పేరిట, మానవునికోసం పారిశ్రామిక నేరువులు నిర్మిత మవుతున్నాయి. మానవుడే యిప్పుడు నేరువుగా పరిణామం చెందుతున్నాడు. శతాబ్దాల తరబడి బడుగుస్థితిలో మోడుగా, బీడుగా మారిన పదహారుకోట్ల హృదయాలు తొలిపంచవర్ష ప్రణాళిక వసంత గమనంతో తిరిగి చిగిర్చి, పుష్పించసాగాయి. ఆ పదహారుకోట్ల హృదయాలు ఈనాడు పదహారు కోట్ల ఉద్యానవనాలు. మానవునికి, మానవ సమాజానికి మధ్యగల సంబంధం నిర్దిష్టరూపం ధరిస్తోంది. నాలుగేళ్ల క్రితం 'చూడండి! మేమెలా దినదిన ప్రవర్ధమాన మవుతున్నామో' అంటూ వారు మాకు తలెత్తుతున్న కొత్త కొత్త ఫ్యాక్టరీలను చూపించారు. మళ్లీ ఈనాడు "చూడండి! మేమెలా వృద్ధిచెందుతున్నామో" అంటూ ఫ్యాక్టరీనుంచి ఈవలకు వస్తున్న మానవుణ్ణి మాకు చూపించారు."

1936 వేసవి కాలంలో ఫ్యూజిక్ సోవియట్ యూనియన్‌నుంచి స్వదేశం తిరిగివచ్చాడు. 'రూడె

ప్రావో పత్రికలో పని చేశాడు. అప్పటికింకా అతనిపై అరెస్టు వారెంటు వుండేది. అందువల్ల అతను దాదాపు రహస్య జీవితమే గడపవలసివచ్చింది. స్పెయిన్ అంతర్యుద్ధం ప్రారంభమైంది. ఫాసిస్టు నియంత ఫ్రాంకో స్పానిష్ ప్రజలపై సాగిస్తున్న దుష్కృత్యాలనుగురించి చెక్ ప్రజానీకానికి ఫ్యూజిక్ వివరించి చెప్పాడు. సోషలిస్టు వ్యవస్థాపన జరుగుతున్న సోవియట్ యూనియన్ నుంచి నేర్చుకోవలసిన విషయాలేమిటో ప్రజలకు వివరించి చెప్పాడు. అంతకంతకు పెచ్చు పెరిగిపోతున్న ఫాసిస్టు ప్రమాదానికీ, యుద్ధ ప్రమాదానికి ప్రతికూలంగా చిత్తశుద్ధిగల ప్రగతిశీలురంతా సమైక్యం కావలసిన అవసరం ఎంతో వుందని ఎలుగెత్తి చాటాడు. 'రూడె ప్రావో' పత్రికను కంటిలో పాపలాగా కాపాడుతూ వస్తున్న క్లెమెంట్ గోట్వాల్డ్ ప్రత్యక్ష సారధ్యం క్రింద ఫ్యూజిక్ పనిచేశాడు. 'రూడే ప్రావో' పత్రికలో పనిచేసిన అనేకమంది పాత్రికేయులు అత్యుత్తమ యోధులుగా అభివృద్ధి చెందారు. అలాంటివారిలో ఫ్యూజిక్, ఎడ్వర్డ్ ఉర్క్స్, ఫ్రాంటిసెక్ క్రెజెక్, వాక్లాజా క్రెన్, జీన్ క్రెజ్కా మున్నగువారు అగ్రగణ్యులు. వారంతా హిట్లర్ ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడుతూ ఆత్మార్పణ చేశారు.

1938 లో ఫ్యూజిక్ తిరిగి 'త్వోర్బా' పత్రిక సంపాదకత్వ బాధ్యతలను స్వీకరించాడు. హిట్లర్ ఫాసిజం చెకోస్లొవాక్ రిపబ్లిక్ కు ప్రమాదం ముంచుకొస్తోందని హెచ్చరిస్తూ అనేక వ్యాసాలు ప్రకటించాడు. దేశంలో గల విద్రోహులను సదా ఒక కంట కనిపెట్టుతూ వుండాలని హెచ్చరిక చేశాడు. మాతృ దేశ స్వాతంత్ర్యాన్ని సంరక్షించటంకోసం కమ్యూనిస్టుపార్టీ

ప్రజలను సమీకరించసాగింది. 1938 వేసంగిలో ఫ్యూజిక్ ఎర్ర సైన్యం వచ్చి సహాయపడుతుందా? అన్న కరపత్రం ప్రకటించాడు. సోవియట్ సైన్యం అంటే జెక్ ప్రజలలో గల విశ్వాసాన్ని, అభిమానాన్ని పెంపొందించటానికి ఆ కరపత్రం బాగా తోడ్పడింది.

1938 సెప్టెంబరులో హిట్లర్‌తో చాంబర్లేన్ రాజీపడ్డాడు. సుడెటన్ ప్రాంతాన్ని హిట్లర్‌కు ధారాదత్తం చేయటానికి జెక్ ప్రభుత్వం అంగీకరించింది. ప్రభుత్వ విద్రోహచర్యను ఖండిస్తూ ప్రదర్శనలు చేయమని ప్రజలకు కమ్యూనిస్టుపార్టీ పిలుపు యిచ్చింది. లక్షలాది ప్రజలు వీధులలోకి వచ్చారు. ప్రభుత్వం రాజీనామా చేయవలసి వచ్చింది. సెప్టెంబరు 21 వ తేదీన ప్రాగ్‌లోని సైనిక బారకాసులముందు సమావేశమైన పదిహేను వేలమంది ప్రజల సమక్షంలో ఫ్యూజిక్ ప్రసంగించాడు. స్వాతంత్ర్య యోధులంతా, పౌరులూ, సైనికులూ, భుజం భుజం కలిపి దేశ స్వాతంత్ర్యాన్ని సంరక్షించవలసిన సమయం ఆసన్నమైందని విజ్ఞప్తి చేశాడు. సెప్టెంబరు 24 వ తేదీన సైనిక సమీకరణ ఉత్తర్వును ప్రభుత్వం ప్రకటించింది. వెంటనే ఫ్యూజిక్ కలం వదిలి కత్తి పట్టాడు. 'రూడెప్రావో' కార్యాలయం వదిలిపెట్టి, సైన్యంలో ప్రవేశించాడు. జెక్ కవి పుంగవులు రచించిన సమరశీల గేయాలతో ఫ్యూజిక్ తోటి సైనికులను ఉత్తేజపర్చసాగాడు.

కొత్తప్రభుత్వం పన్నిన పన్నాగమూ, అధ్యక్షుడు బెనిష్ కొనసాగిస్తున్న లొంగుబాటు తత్వ సంప్రతింపులు అప్పటికింకా బయటపడలేదు. సైనిక సమీకరణ కేవలం

మోసపు కుట్ర అనిగానీ, ప్రజలను గందరగోళంలో ముంచె తతంగం కోసం పన్నిన పన్నాగమనిగానీ ఎవరూ గ్రహించలేకపోయారు. 1930 సెప్టెంబరు 30వ తేదీ కమ్యూనిస్ట్ విద్రోహం జరగనే జరిగింది.

కీలుబొమ్మ ప్రభుత్వం లొంగిపోయింది. 'రూడే ప్రావో' ఇతర కమ్యూనిస్టు పత్రికలు నిషేధించబడ్డాయి. కమ్యూనిస్టు పార్టీనికూడా ప్రభుత్వం నిషేధించింది. అయినప్పటికీ అతి రహస్యంగా తన కార్యకలాపాలను యథేచ్ఛగా కొనసాగించ గల్గింది. పార్టీ సభ్యులలో కొందరు విదేశాలకు వెళ్ళి అక్కడ వుంటూ పనిచేయాలనీ, మరికొందరు దేశంలోనే వుంటూ, రహస్యంగా పనిచేస్తుండాలనీ, ఇంకొందరు దేశంలోనే బహిరంగంగా పనిచేస్తూండాలనీ – ఇలా పని విభజన జరిగింది. ఫ్యూజిక్ బహిరంగంగా కార్మికులలోను, అభ్యుదయకర పత్రికలలో పనిచేస్తూ, తన కలం బలంతో చైతన్యం రగల్చాలని నిర్ణయించారు.

ఆ దశలో ఫ్యూజిక్ జెక్ చరిత్రను తన ప్రచార సాధనంగా చేపట్టాడు. చరిత్ర చీకటికోణం అట్టడుగున పడి కన్పించని కథలన్నింటినీ త్రవ్వి వెలుగులోకి తీసుకొచ్చాడు. ఆ చారిత్రక గాథల సహాయంతో ప్రజల హృదయాలను చైతన్యప్రదీప్తం చేశాడు. "మన ప్రజల హృదయాంతరాళంలో అభేద్యమైన శక్తి వుంది. జెక్ చరిత్రను పరికిస్తే అది వెల్లడవుతోంది. జెక్ ప్రజలు యెల్లప్పుడు సత్యాన్వేషణకొరకే త్రికరణ శుద్ధిగా కృషిచేస్తూవచ్చారు: సత్యాన్వేషణలో ఎన్ని యిడుములను సహించటానికైనా వారు వెనుదీయలేదు; పాలకులుపెట్టే యమ

యాతనలను వారు లక్ష్యపెట్టలేదు. ఉజ్జ్వలభవిష్యత్తు గలదన్న అచంచల విశ్వాసంతో వారు ముందుకు సాగారు!!"

పరాజయ భీతికి, నిరాశావాదానికి ఫ్యూజిక్ ఎన్నడూ లోనుకాలేదు. విప్లవకర హుస్సైట్ సంప్రదాయాన్ని గురించి జెక్ మహాకవి జాన్ నెరూడా పిలుపును స్మరించుకోమని అతను తన ప్రజలకు విజ్ఞప్తి చేశాడు:

"మానవుని స్వేచ్ఛకొరకు, సర్వజనుల స్వాతంత్ర్యం కొరకు, హుస్సైట్ పోరాటాలు సాగించబడ్డాయి. ఆ పోరాట సాంప్రదాయాలను నెరూడా ప్రస్తుతించాడు. ఆ సత్సంప్రదాయాలను యింకా ముందుకు గొంపోవాలని గొంతెత్తి చాటాడు. అప్పుడే జెక్ ప్రజలకు ఉజ్జ్వల భవితవ్యం స్థిరీభూతమవుతుందని స్పష్టంచేశాడు. అభినవ బానిస ప్రభువుల ఆటలు సాగనివ్వరాదు. వారికి వ్యతిరేకంగా సకల మానవాళి స్వాతంత్ర్యాన్ని పదిలపర్చేందుకు పోరాటం సాగించాలి. అలా పోరాడినప్పుడే జెక్ ప్రజల స్వాతంత్ర్యంకూడా సిద్ధిస్తుందని నెరూడా విశ్వసించాడు. హుస్సైట్ పోరాటమార్గంలో మనం ముందుకే, మున్ముందుకే జైత్రయాత్ర సాగించాలని నెరూడా పిలుపు యిచ్చాడు"

వైట్ మౌంటెన్ పోరాటానంతర దశను గురించి ఫ్యూజిక్ వ్రాశాడు: ఆ దశలో ప్రజలు ఎలాంటి గౌరవం పొందారో, ఆనాటి అభ్యుదయకర సాంప్రదాయాలేమిటో అతను విశదీకరించాడు. జెక్ నూతన సంస్కృతీ స్వభావం గురించీ, జెక్ సాహితీరంగంలో ప్రముఖులనుగురించి, ప్రజలకు తెలియజెప్పాడు.

మ్యూనిక్ విగ్రహం ఫణ్యమాలంటూ, 1939 మార్చి 15 వ తేదీన జెక్ దేశం నాజీల పాదాక్రాంతమైంది. ఆ మరు సటి రోజునే ఫ్యూజిక్ ఒక నవలను రచించటానికి ఉపక్రమిం చాడు. "పీటర్ ముందు తరంవారు" అనే పేరుతో ఆ నవల వెలువడింది. ఆ నవలకు వ్రాసిన ఉపోద్ఘాతంలో ఫ్యూజిక్ ఎంతో దూరదృష్టితో ఈ క్రింది వాక్యాలు వ్రాశాడు: పీటర్! మేమంతా భూమిలో నాటబడిన విత్తనాలవంటివారం. ఇవాళ కాకపోతే కేపైనా వసంతకాలం రాకపోదు. విత్తనాలన్నీ గాకపోయినా, కొన్నయినా మొలకెత్తకపోవు. ఇనప పాదాల పదఘట్టనక్రింద పడి నేను నలిగిపోయినా నలిగిపోవచ్చు. కాక తాళీయంగానో లేక దురుద్దేశంతోనో లేదా ద్వేషబుద్ధితోనో ఆ ఇనుప పాదాలు మమ్మల్ని సర్వనాశనంచేసినా చేయవచ్చు. అలాఅని మాకుస్పష్టంగా తెలుసు. ఆ అవగాహనతోనే మేము జీవిస్తున్నాం.

"కాని పీటర్! మేమేదో భయస్తులవలె వణికిపోతున్నామని మాత్రం తలంచకు. మాలోనివారంతా పెరిగి వృద్ధిలోకిరారు; అలాగే మాలో ప్రతిఒక్కరూ నాశనమైపోనూ పోరు. ఈ విషయం మాకు బాగా తెలుసు. తెలిసే జీవిస్తున్నాం. ఈ నాటి భీభత్సాలు భయాందోళనలన్నింటినీ మరచిపోయే రోజు తప్పకుండా వస్తుంది. ఇప్పుడే చెప్పటమెందుకులే! పండిన ఈ పంటను మీ తరంవారు అనుభవిస్తారు. అప్పుడే మీరు పూర్తిగా గ్రహిస్తారు. మా అందరిదతరఫునా, సజీవులు, విగత జీవు లందరితరఫునా ఈ క్రింది మాటలు మీకు విన్పించక మానవు: "స్వీకరించండి. అనుభవించండి. ఇదే నా సర్వస్వం."

ఫ్యూజిక్ వ్యాసాలు ప్రచురితమయ్యే పత్రిక లన్నింటినీ ఫాసిస్టులు నిషేధించారు. ఒకానొక ఫాసిస్టు పత్రికలో సంస్కృతీ విషయాలపై వ్యాసాలు వ్రాయమని ఫ్యూజిక్‌కు ఆహ్వానం అందింది. దానిని అతను తిరస్కరించాడు. ప్రాగ్‌లో వుండి చేసేదేమీ లేనందున, అతడు అప్పుడు కొంతకాలంపాటు ఒక గ్రామంలో గడిపాడు. ఆ గ్రామంలో వున్నప్పుడే జెక్ సాహిత్య చరిత్రను కొత్త దృక్కోణంనుంచి పరిశోధనచేశాడు. ఆ కాలంలోనే జక్ చరిత్రను నూతన దృక్కోణంనుంచీ చూడడానికి అనువుగా ఒక గ్రంథం వ్రాయవలెననే ఆలోచన వచ్చింది. ఆ ఆలోచనే అటుతర్వాత "నోరునొక్కి వేయబడిన వారు: విస్మరించబడినవారు" అనే గ్రంథరూపం ధరించింది

1940 జూన్‌లో ఫ్యూజిక్‌కోసం గెస్టాపోలు (ఫాసిస్టు పోలీసులు) వేట ప్రారంభించారు. ఈ విషయం ముందే పసికట్టిన ఫ్యూజిక్ ఫాసిస్టుల కళ్లలో కారం చల్లి తప్పించుకొన్నాడు. అతని తల్లిదండ్రులు అప్పట్లో ప్లజెన్‌లో నివసిస్తున్నారు. వారు నివసిస్తున్న యింటిపై గెస్టాపోలు దాడి చేశారు. కాని కావలసిన వ్యక్తి ఫాసిస్టులకు దొరకనేలేదు. అతను ప్రాగ్ నగరంలోనే రహస్య జీవితం గడుపుతున్నాడు. రహస్య జీవితం గడుపుతూకూడా పలుమార్లు మ్యూజియం గ్రంథాలయానికి వెళ్లి, కావలసిన గ్రంథాలు తిరగేస్తూ వుండేవాడు.

గెస్టాపో ఆజ్ఞానుసారం ఒక జెక్ పోలీసు ఫ్యూజిక్‌ను అరెస్టు చేయటానికి వచ్చాడు. ఆ జెక్ పోలీసుతో ఫ్యూజిక్ చాలాసేపు చర్చించాడు. ఫాసిస్టులకోసం జెక్ సోదరులను పట్టి యివ్వటం ఎంత పాపమో నచ్చచెప్పి వొప్పించాడు. ఆ

విధంగా ఫ్యూజిక్ అరెస్టు కాకుండా తప్పించుకొన్నాడు. సాధారణ ప్రజలమధ్య, నీటిలో చేపలాగా, అతను రహస్య జీవితం గడుపుతూ వచ్చాడు. ప్రాణహాని వున్నదని తెలిసికూడా సామాన్య ప్రజలు ఫ్యూజిక్‌కు రక్షణ యిచ్చారు; కంటిలో పాపలాగా కాపాడుకొన్నారు. నాజీ ప్రచారశాఖ మంత్రి యైన గోబెల్సుకు "బహిరంగలేఖ"ను జెక్ మేధావుల తరఫున ఫ్యూజిక్ వ్రాశాడు; ఆ బహిరంగ లేఖ రహస్య కరపత్రం రూపంలో వెలువడింది.

"దమ్మిడీకి కొరగాని ఓ సిందామూర్తీ! జెక్ మేధావులైన నాకు ఆత్మగౌరవమూ వుంది; వ్యక్తిత్వమూ వుంది. జెక్ ప్రజలలోనుంచి తలెత్తినవాళ్లం. బహుశా ఈ విషయం తెలియక నీవు ఎన్నో భ్రమలు పెట్టుకొని వుంటావు. మా ప్రజలనుంచి మమ్మల్ను వేరుచేయటం, చీలదీయటం నీ తరం కాదు. ఆశలుపెట్టి మమ్మల్ను మోసగించలేవు; భయపెట్టి మమ్మల్ని లొంగదీసుకోటం నీ తరంకాదు. ప్రజలకు వ్యతిరేకంగా గెస్టాపో పక్షాన మేము చేరటం ఎన్నటికి జరగని విషయం—అదే మా సమాధానం."

ఎల్. హానస్ అనే ఉపాధ్యాయుడు అభ్యుదయభావాలు కలవాడు. అతని సంపాదకత్వాన వెలువడిన 'రోజ్' అనే పిల్లల పత్రికలో మారుపేరుతో ఫ్యూజిక్ వ్యాసాలు ప్రకటించాడు. తరువాత కొంతకాలానికి ఫాసిస్టులు ఎల్. హానస్‌ను చిత్రహింసలకు గురిచేసి, ప్రాణాలుతీశారు. జెక్ సంస్కృతిపట్ల, జెక్ భాషపట్ల, జెక్ జాతిపట్ల పిల్లలలో అభిమానం, అనురాగం పెంపొందేటట్లుగా ఫ్యూజిక్ పెక్కు వ్యాసాలు

వ్రాశాడు; జెక్ రచయితలనుగురించి పిల్లలకు పరిచయం చేశాడు.

1941 లో మొదటి అజ్ఞాతవాస కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీలోని సభ్యులందరినీ ఫాసిస్టులు అరెస్టుచేశారు. అప్పుడు ఫ్యూజిక్ చొరవతీసుకొని, రెండవ అజ్ఞాతవాస కేంద్ర కమిటీని ఏర్పాటుచేశాడు. ఆ కమిటీలో ఫ్యూజిక్, జన్‌జికా, జన్ సెర్నీలు సభ్యులు. రాజకీయ కార్యకలాపాలు, ప్రచారం – ఈ రెండు బాధ్యతలను ఫ్యూజిక్ స్వీకరించాడు. 1941 వ సంవత్సరంలోను, 1942 మొదట్లోను దేశం నలుమూలలాగల ఫ్యాక్టరీలలోకి రహస్య పత్రికలు, కరపత్రాలు ధారావాహికంగా ప్రవహించాయి. ఆ పత్రికలు, కరపత్రాలు ప్రజాసామాన్యాన్ని ఉత్తేజపర్చాయి; ఉత్సాహపర్చాయి. ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజలందరినీ సమీకరిచేందుకు అవి సాధనాలయ్యాయి. సోవియట్ యూనియన్ పట్ల, వీరోచితమైన ఎర్రసైన్యంపట్ల ప్రజలలో ప్రేమాభిమానాలను అవి జనింపచేశాయి. 'రూడేప్రావో', తదితర పత్రికలను రహస్యంగా నిర్వహించడమే ఫ్యూజిక్ ప్రధాన బాధ్యతగా వుండేది. 1942 లో ఫాసిస్టులు ప్రాగ్ నగరంలో సోవియట్ వ్యతిరేక ప్రదర్శనశాల నొకదానిని ఏర్పాటు చేశారు. ఆ సందర్భంలో 'సోవియట్ స్వర్గం' "ప్రదర్శనశాలకూ, సోవియట్ వాస్తవానికి దక్కూనచి" అన్న రహస్య కరపత్రాన్ని ఫ్యూజిక్ ప్రకటించాడు. అలాగే సోవియట్ యూనియన్ రాజ్యాంగాన్ని వెలువరించాడు. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సంక్షిప్త చరిత్ర ప్రతులను టైప్ చేయించి. ప్రచారంలోకి తీసుకొచ్చాడు.

ఆ విధంగానే హిట్లర్ ఆక్రమణ సైన్యాలు సాగిస్తున్న దౌష్ట్యా లను ఖండిస్తూ అనేక కరపత్రాలు ప్రకటించాడు. జాతీయ విప్లవకర సంఘాల నిర్మాతలలో ఫ్యూజిక్ ఒకడు గోత్వాల్డ్ అప్పట్లో మాస్కోలో వున్నారు. ఆయన ఆదేశానుసారం ఫ్యూజిక్ విప్లవకర సంఘాలను నెలకొల్పాడు. 1941 మే దినోత్సవ సందర్భంలో అతను ప్రకటించిన కరపత్రంలో ఇలా వుంది :

"అవును. మేము అజ్ఞాతవాసంలోనే వున్నాం. అయితే మృతప్రాయులంగా మేము కాలక్షేపం చేయటంలేదు. పచ్చ పచ్చగా పెరిగి, పండి వసుగుతున్న సోషలిస్టు పైరులం మేము. వసంతా గమనం ఎంతో దూరాన లేదు. ప్రపంచమంతటా పంటల తరుణం రానేవస్తోంది. ఆ వసంతా గమనానికి మే దినోత్సవం వైతాళికగీతి పాడుతుంది. స్వేచ్ఛామానవుని వసంతం, జనానీకపు వసంతం, సర్వమానవ సౌహార్ద వసంతం. అలాంటి వసంతాభిముఖంగా, అజ్ఞాతవాసపు అంధకారంలో మేము ముందుకు సాగుతున్నాం."

ఫాసిస్టు ఆక్రమణశక్తులనుంచి తన మాతృదేశ ప్రజ లను విముక్తం చేసేందుకు ఫ్యూజిక్ విసుగు, విరామం ఎరుగక వీరోచితమైన పోరాటం సాగిస్తున్న సమయంలోనే, ఆ మహా యోధునిచుట్టూ, ఫాసిస్టులు ఉచ్చు పన్నసాగారు. ఫ్యూజిక్ లక్ష్యం, ధ్యేయం ఒకటే: తన దేశానికి స్వాతంత్ర్యం సాధిం చాలి; సోషలిజం విజయవంత మొనర్చాలి. అందుకోసమే అతను అహర్నిశలు పాటుబడ్డాడు. పోరాటం సాగించాడు. తత్పర్యవసానంగానే ఫాసిస్టుల క్రోధానికి గురయ్యాడు. ఆ

లక్ష్యసాధనకే కారాగారవాసం అనుభవించాడు. స్వీయ సౌఖ్యాలను కాలదన్నాడు. గెస్టాపో మూక చేతుల్లో యమ యాతన లనుభవించాడు. చివరకు ఉరికంబం ఎక్కాడు.

కమ్యూనిస్టు నాయకత్వాన్ని బంధించాలనీ, రహస్యోద్యమాన్ని రూపుమాపాలనీ ఫాసిస్టు గెస్టాపోలు సర్వ ప్రయత్నాలు చేయసాగారు. వేలకొలది కమ్యూనిస్టులను, వేనకు వేలు జెక్ దేశభక్తులను మూకుమ్మడిగా అరెస్టు చేశారు; వారిని చిత్రహింసలకు గురిచేశారు. ప్రాణాలు తీశారు. మాతృ దేశాన్ని అమితంగా ప్రేమించి, దేశ స్వాతంత్ర్యంకోసం వీరాభిమన్యులవలె నిలబడి పోరాడిన అనేకమంది అజ్ఞాత యోధులు, అత్యుత్తమ దేశభక్తులు ఆత్మార్పణ చేశారు. 1942 ఏప్రిల్ 24 వ తేదీన ప్రాగ్ నగరంలో గెస్టాపోలు ఫ్యూజిక్‌ను అరెస్టు చేశారు. పాంక్రాస్ జైలులోని 267 వ నెంబరు సెల్లులో అతనిని 1943 వసంతకాలంవరకు బంధించారు.

ఫాసిస్టులు తనను ఎలా అరెస్టు చేసిందీ 'రక్తాక్షరాలు' అన్న గ్రంథంలో ఫ్యూజిక్ వివరించాడు. ఫ్యూజిక్ అరెస్టుకు సంబంధించిన యదార్థ విషయాలు అప్పట్లో ఎవరికీ తెలియ లేదు. 1952లో పట్టుబడిన కుట్రదారులు అసలు విషయం వెల్లడి చేశారు. ఆ కుట్రదారులలో ఒకడు జెకోస్లావాకియా కమ్యూనిస్టుపార్టీలో ప్రవేశించి, అనేక సంవత్సరాలు పార్టీలో పనిచేశాడు. అందువల్ల అతనిని ఫ్యూజిక్ పూర్తిగా విశ్వసించాడు. 1939 లో ఫాసిస్టులు అతనిని అరెస్టుచేయగా, ఆ ద్రోహి అన్ని విషయాలు వెల్లడించి, తన ప్రాణాలను మాత్రం కాపాడుకొన్నాడు. ఆ ద్రోహి స్వయంగా ఫ్యూజిక్

ఆరాలుతీసి, కొంటాడి, పట్టుకొని గెస్టాపోలకు అప్పజెప్పాడు. తాను ద్రోహానికి ఒడిగట్టినట్లు అతనే స్వయంగా అంగీకరించాడు. ఫ్యూజిక్ మరణానికి మాత్రమేకాక, ఫ్యూజిక్ సహచరులలో అనేకమంది చావుకుకూడా తానే బాధ్యుడనని అతను చెప్పుకొన్నాడు.

గెస్టాపోలు ఫ్యూజిక్‌ను సంవత్సరం పైచిలుకు, డిటెన్షన్ క్యాంపులో పెట్టి, యమలోక యాతనలను మరపించి చిత్రహింసలు పెట్టారు. ఆలా చిత్రహింసలకు గురిచేస్తే, కమ్యూనిస్టుపార్టీ నాయకుల ఆచూకీ, భోగట్టాలను ఫ్యూజిక్ నుంచి రాబట్టవచ్చునని ఆ ఫాసిస్టు యమకింకరులు భ్రమించారు.

ఫాసిస్టు బందిఖానాలో వుంటూకూడా ఫ్యూజిక్ పోరు సాగించాడు; ఫాసిస్టు దుష్టశక్తులముందు తలొంచలేదు. ఎటు తిరిగీ ఇక తన బ్రతుక్కి చరమాంక మాసన్నమైనదన్న విషయం అతనికి పూర్తిగా తెలుసు. అయితేనేం? త్వరలోనే ప్రజలు స్వాతంత్ర్య వాయువు పీల్చుతూ జీవిస్తారు. అతని ఆనందం ఆత్మవిశ్వాసం అదే. 1917 అక్టోబరు విప్లవ ఫలితంగా ఏర్పడ్డ సోవియట్ యూనియన్ న్యాయమైన మానవ జీవన విధానం అనేది ఎలా వుండాలో తెలుసుకోడానికి మానవాళికి దృష్టాంతంగాఉపకరించింది. అదే సోవియట్ యూనియన్ తిరిగి యిప్పుడు హిట్లర్ ఫాసిజాన్ని భూస్థాపితంచేస్తుంది. ఫాసిస్టుదాస్యం నుంచిఅనేక దేశాల ప్రజలను విముక్తి చేస్తుంది — తుదిక్షణాలలో ఫ్యూజిక్ హృదయ వీధులలో తారాడిన భావం ఇదే. అమానుషమైన చిత్రహింసలకు లోనైన పిమ్మట, తాను మరణించటం ఖాయం అని స్పష్టమైపోయిన తర్వాత,

పాంక్రాస్ జైలులో వుంటూ ఈ క్రింది అమర వాక్యాలు వ్రాశాడు:

"దీనికి నేను విచారపడబోను. నేను అసలు దేనికీ విచార పడను. నే చేసినపని నాకు చేతనైనంతవరకు,శక్తివంచనలేకుండా, సంతోషపూర్వకంగానే చేశాను."

శారీరకమైన యమయాతనలను అనుభవిస్తూ, ఫాసిస్టు గెస్టాపోలువేసే రకరకాలైన ప్రశ్నలతో మానసిక బాధకు గురియవుతూ, చిత్రహింసలను పళ్ల బిగువున సహిస్తూన్న ఆ రోజులలో, కటికి చీకటి ఆవహించి వున్న ఆ గెస్టాపో కేంద్ర కార్యాలయంలో మేమిద్దరం కలుసుకొన్నప్పుడు ఫ్యూజిక్ నా చెవిలో వూదిన మాటలు ఇవి: "నాకు తెలుసు. నేను మృత్యుగహ్వరంలో వున్నాను. నేను బ్రతికి బయటపడాలంటే ఏదో అనూహ్యమైన విచిత్రం జరిగితీరాలి. అనూహ్యమైన విచిత్రాలంటూ సంభవించటం అసంభవం. ఏది ఏమైనా నేనీ క్షణంలో చావునుగురించి ఈ షణ్మాత్రం ఆలోచించటం లేదంటే నమ్ము."

అందుకు దృష్టాంతం కావాలా? అయితే "రక్తాక్షరాలు" గ్రంథమే అందుకు సాదృశ్యం. పాంక్రాస్ జైలులో వుంటూ రహస్యంగా ఒక్కొక్క కాగితంపై నే వ్రాస్తూ. మళ్లీ రహస్యంగా కాగితాలన్నింటినీ ఫ్యూజిక్ జైలు గోడలు దాటించే ఏర్పాటుచేశాడు. జైలువార్డెన్ ఎ. కోలిన్‌స్కీ యిందుకు సర్వవిధాల తోడ్పడ్డాడు.విప్లవ వీరయోధుడైన ఫ్యూజిక్‌లోని సర్వోత్తమ గుణాలన్నింటికీ రక్తాక్షరాలు"చక్కని ప్రతిబింబం: అతని నిరాడంబరత్వం, అతనిలోని

నిజాయితీ, పిలిస్తే పలికే ఆ చిరునవ్వు, కమ్యూనిస్టులలో వుండే ఆత్మౌన్నత్యం, సోవియట్ యూనియన్ పట్ల అతనికి గల ప్రేమానురాగాలు, ఫాసిజం పరాజితమై తీరుతుందన్న అతని ఆత్మ విశ్వాసం. ఇవన్నీ 'రక్తాక్షరాల'లో సువ్యక్త మవుతున్నాయి. లెనిన్, స్టాలిన్‌ల ఉపదేశాలలోని వివేకసంపదనుంచీ ప్రపంచ పరివ్యాప్తం గాగల కమ్యూనిస్టు ఉద్యమ సేనావాహిని అప్రతిహత శక్తినుంచీ ఫ్యూజిక్ మానవాతీతమైన శక్తిని సంతరింపజేసుకొని ఆ గ్రంథం రచించగల్గాడు. లెనిన్ స్టాలిన్‌ల ఉపదేశానుసారం ఉద్యమిస్తూన్న మహాసేనావాహినిలో తనూ అంతర్భాగంగా వున్న విషయం అతనికి తెలుసు. అందుకే 1943 ఆగస్టు 23న తేదీన బెర్లిన్ నాజీ కోర్టులో తనను విచారిస్తున్న సందర్భంలో అతను వీరయోధుడుగా వ్యవహరించ గల్గాడు.

"జ్యూలియస్ ఫ్యూజిక్: అంతిమ పోరాటం" అన్న తన గ్రంథంలో జె. రెజ్నిక్, ఫ్యూజిక్ తుది దినాలలో ఎలా వ్యవహరించాడో వివరించాడు:

"కోర్టులో, ముఖ్య న్యాయమూర్తి ఫ్రీస్లర్, ఫ్యూజిక్‌ను ఇలా ప్రశ్నించాడు: "నీవు కొనసాగించిన చర్యలు రీచ్ శత్రువులైన బోల్షివిక్ రష్యాకు తోడ్పడ్డాయన్న విషయం నీవు అంగీకరిస్తావా? ఆనాజీ ముష్కరులకు ఫ్యూజిక్ సగర్వంగా ఇచ్చిన సమాధానం ఇదే. "అవును. నేను సోవియట్ యూనియన్‌కు సహాయపడ్డాను. అందులో సందేహం లేదు. నిజానికి అంతకుతప్ప నేను చేయగల్గిందీ లేదు. పెట్టుబడిదారీపాలనతో నాకు పొత్తుకుదరటం అసంభవం. యుద్ధానంతరం రోజులు

మారి తీరుతాయన్న విశ్వాసం నాకు పూర్తిగా వుంది. ఆక్రమణ బలాలను దేశంనుంచి తన్ని తరిమేయటానికి ప్రజలకు తోడ్పడే నిమిత్తమే నేను రహస్యంగా పనిచేయసాగాను. ఆక్రమణ బలాలతోపాటు, విద్రోహులతో ఏర్పడిన 'రక్షిత' ప్రభుత్వాన్ని కూడా పారద్రోలాలి. అంతేకాదు. ఎవరైతే నా దేశ ప్రజలకు ఈ ఘోర విపత్తును తెచ్చిపెట్టారో, ఎవరైతే 1938కి పూర్వమే ఏనాటినుంచో విద్రోహానికి ఒడిగట్టేందుకు ఆయత్తమయారో అలాంటివారు విముక్తి పొందిన తర్వాత తిరిగి అధికారంలోకి రావటమే తటస్థిస్తే, ఇక అప్పుడు మేము సాగించిన పోరాటం యావత్తూ బూడిదలో పోసిన పన్నీరులాగ నిష్ప్రయోజనమైపోతుంది. రాజకీయంగా అంధులైన ఆ వ్యక్తే తిరిగి నా దేశానికి నాయకత్వం వహించటం అంటే అసలు అర్థం వుండదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ప్రజలకు నిజమైన స్వేచ్ఛను సంపాదించిపెట్టే, సోషలిస్టు చెక్ రాజ్యాన్ని నెలకొల్పటంకోసం నా రహస్య విప్లవ కార్యకలాపాలు ఉద్దేశించబడ్డాయి."

క్రీస్లర్ ముఖం కందగడ్డలాగా మారిపోయింది. అతను గొంతు చించుకోసాగాడు. తేలుకుట్టిన కోతిలాగా గంతులేయ సాగాడు. అయినా ఫ్యూజిక్ తన ప్రసంగాన్ని విరమించలేదు. తలపైకెత్తి, ధీమాతో ప్రభుత్వ న్యాయవాది మొఖాన, న్యాయమూర్తుల మొఖాన ఇలా కడిగివేశాడు:

"మీరు నాకు శిక్ష విధిస్తారు. నాకు తెలుసు. మీరు విధించబోయే శిక్ష ఇదే: ఒకవ్యక్తికి మరణశిక్ష. అయితే ఒక విషయం. నేను మీకందరికీ ఏనాడో శిక్ష విధించాను. ప్రపంచం

నాలుగు చెరగులా గల నిజాయితీపరుల రక్తంతో ఆ శిక్ష ఉక్షేళితమైంది. ఫాసిజం నశించాలి; పెట్టుబడిదారీ బానిసత్వం అంతరించిపోవాలి. మానవునికి సుఖప్రదమైన జీవితం చేకూరాలి. భవిష్యత్తంతా కమ్యూనిజానికే''

1943 సెప్టెంబరు 8 వతేదీన, మరణశిక్ష విధించిన అనంతరం 14 వరోజున, తెల్లవారుఝామున 4-30 గంటలకు బెర్లిన్ జైలులో నాజీలు ఫ్యూజిక్‌ను ఉరితీసి చంపారు.

ఉరికంబానికి తీసుకుపోతూంటే, అతను అంతర్జాతీయ గీతం ఆలాపించాడు. ఫాసిస్టులు అతని నోరు నొక్కి వేయాలని ప్రయత్నించారు. అయినా అతను కంఠం విప్పి పాడటం మానలేదు. అల్లంత దూరాన నాలుగు గోడలమధ్య వున్న ఖైదీలందరికీ శ్రామికవర్గ జాతీయగేయాలాపన విన్పించింది. ఉరికంబం ఎక్కుతున్న సమయంలో, ఉరితాడు మెడకు పెనవేసుకుంటూన్నప్పుడు మానవాళికి సౌభాగ్యానందాలు కలగాలని ఘోషించే గేయాన్ని గానం చేశాడు. చిరునగవుతో, భవిష్యత్తుపట్ల అచంచల విశ్వాసంతో మరణదేవతకు స్వాగతం పలికాడు.

ఫ్యూజిక్ జక్ జాతీయ యోధుడు. అతని యావజ్జీవితం స్వాతంత్ర్య పోరాటంలోనే గడిపాడు. ఎన్నడూ పిరికితనం ప్రదర్శించలేదు. జెకోస్లోవేకియా దేశంలో ఫ్యూజిక్ పేరు ఈనాడు వూరూరా వాడవాడలా మార్మోగుతోంది. అతను దేనికోసమైతే ఆత్మార్పణ చేశాడో, ఆ సోషలిస్టు జీవనమే దేశంలో ప్రవర్ధమానమవుతోంది. జెక్ దేశస్థులలో అనేకమంది తమ ముద్దుబిడ్డలకు ఫ్యూజిక్ పేరు పెట్టుకొన్నారు.

అతను రచించిన "రక్తాక్షరాలు" గ్రంథానికి శాంతి ప్రియమానవాళి నివాళు లెత్తుతోంది. ఆ గ్రంథం తొలుత 1945లో ప్రకటితమైంది. నాటినుంచి నేటివరకు అది 68 భాషలలో 154 ముద్రణలు పొందింది.

మానవాళికి నిజంగా ఆనందదాయకమైన జీవితం లభించాలనీ, సుస్థిరశాంతి నెలకొనాలనీ, పాశవిక యుద్ధాలు అంతరించిపోవాలనీ వాంఛించే మహదాశయాలు గలవారందరి భావాలనూ ఫ్యూజిక్ తన గ్రంథమైన "రక్తాక్షరాలలో" చక్కగా పొందుపరచాడు. అందువల్ల యావత్ ప్రపంచములోని ప్రగతిశీలురకూ జ్యూలియస్ ఫ్యూజిక్ అత్యంత ప్రియతముడైనాడు.

1950 లో వార్సా నగరంలో జరిగినప్రపంచ ద్వితీయ శాంతి మహాసభ ఫ్యూజిక్ స్మృత్యర్థం అతని గ్రంథమైన "రక్తాక్షరాలకు" ప్రపంచంలో అత్యంత గౌరవ ప్రదమైన శాంతి బహుమానం బహూకరించింది. ఫ్యూజిక్ కు స్మృతి చిహ్నంగా "రక్తాక్షరాలు" శిలాక్షరాలుగా వెలుగొందు తుంటాయి. తన దేశంపట్లా, స్వాతంత్ర్యం, శాంతియుత పురోభివృద్ధిపట్లా, సోవియట్ ఎడల గల అభిమానం రక్తాక్షరాలలోని ప్రతి అక్షరంలోనూ వ్యక్తమవుతున్నాయి. ఎవరికోసం అయితే ప్రాణం అర్పించాడో వారికి దే ఆయన చివరి ఆజ్ఞాపత్రం.

"ప్రజలారా! మిమ్మల్ని నేను ప్రేమించాను. మీ జాగ్రత్తలో మీరుండండి."